# విద్యా విధానాన్ని ఇప్పటికైనా అర్థం చేసుకుందాం

34 యేళ్ళ సుధీర్గ విరామం తరువాత, కేంద్ర ప్రభుత్వం దేశానికి ఒక నూతన జాతీయ విద్యా విధానాన్ని పరిచయం చేసింది. అప్పటికి ఇప్పటికీ ప్రపంచం ఎంత మారిపోయిందో వేరే చెప్పనవసరం లేదు. 1986 లోనే మొదటిసారిగా రైల్వేల్లో కంప్యూటర్లతో టికెట్లను జారీ చేయటం మొదలుపెట్టారు, 1990 నాటికి కానీ సాఫ్ట్వేర్ పార్కు్లు రాలేదు, అంతర్జాలం అన్న మాటకు అర్థం లేదు. సెల్ఫోన్లు అంటే ఏంటో కూడా తెలియదు. సర్కారీ బడిలో విద్య, సర్కారీ ఉద్యోగాల్లో కొలువు తప్ప విద్యా ఉద్యోగ రంగాల్లో ఇతర అవకాశాలు లభించటం కద్దు. అటువంటి పరిస్థితుల్లో రూపొందిచబడ్డ అప్పటి విద్యా విధానం, ఇన్నేళ్లుగా మన దేశ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు దిశానిర్దేశం చేసింది. నైపుణ్యం కలిగిన, సుశిక్షితమైన శ్రామిక, ఆర్థిక శక్తిగా భారతదేశం ఎదగడానికి ఈ విధానమే పునాది అయ్యింది. కానీ ప్రస్తుత 21వ శతాబ్ద సవాళ్ళకు, ప్రత్యేకించి కరుడుగట్టిన ఈ పోటీ ప్రపంచాన్ని నెగ్గుకొచ్చే విధంగా మన భవిష్యత్ తరాలను తీర్చిదిద్దాల్సిన అవసరం ఎంతైనా ఉంది. స్వావలంబన, స్వయం ఉపాధి, శాస్త్ర, సాంకేతిక పరిశోధనా జిజ్ఞాసలే ప్రధానంగా ఇటీవల మన ప్రధానమంత్రి ఆవిష్కరించిన ఆత్మనిర్భర్ భారత్ స్ఫూర్తికి అనుగుణంగా నిర్దేశించుకున్న లక్ష్యాలని చేరుకోవటానికి ఒక కొత్త విద్యా విధానం ఎంతో అవసరం.

**తరగతులే విద్యా పరమపద సోపానాలు**

నూతన విద్యా విధానం దేశీయ దృక్పథంతో కూడిన విద్యా వ్యవస్థ కోసం విస్తృతమైన బాటను చూపిస్తోందనే చెప్పాలి. విద్యావ్యాప్తి, సమానత్వం, మానవ విలువలు, పౌర భాధ్యతలు, ధర్మ నిరపేక్షత  మరియు క్రియాశీలక జ్ఞాన సముపార్జలనే  గీటురాళ్లుగా మార్చుకుని, 2040 వ సంవత్సరానికి ప్రపంచంలోనే అత్యుత్తమ విద్యా వ్యవస్థ కలిగిన దేశంగా భారతదేశాన్ని నిల్పేందుకు ఈ నూతన విద్యా విధానం రూపొందించబడింది. అయితే సంస్కరణలంటూ ఎన్ని చర్యలు చేపట్టినా అవి తరగతి గదిలో మార్పును తెస్తేనే వాటిని సంస్కరణలుగా చూడాలి. తరగతి గదిలో మార్పు అంటే, డిజిటల్ లెర్నింగ్, అందమైన బల్లలు, పటిష్ఠ భవనాలు లాంటి భౌతిక మార్పులనే కాకుండా  ఉపాధ్యాయ శిక్షణా, వారి నిరంతర వృత్తి నైపుణ్య వికాస కార్యక్రమాలు, విద్యార్థుల్లో బహుముఖ ప్రతిభ పాటవాలను గుర్తించటం, విద్యార్థి గ్రహణ శక్తిని, విజ్ఞాన సముపార్జనను, ఆసక్తిని మెరుగుపరచడం అనే మార్పులను తీసుకురావాలి. విద్యా ప్రణాళికా చట్రం (Curriculum Framework) ప్రకారంగా మనం సిలబస్ ను తయారు చేసి, పాఠ్య పుస్తకాలను ముద్రించి ఇచ్చినా అవి విద్యార్థుల మనసుల్లోకి వెళ్లాయా, విద్యార్థులు శ్రద్ధ కనబరుస్తున్నారా, వారు పాఠ్యాంశాలలో నిమగ్నమయ్యేలా ఉపాధ్యాయులు విశదీకరిస్తున్నారా అనేదే ముఖ్యం. ఉపాధ్యాయ-విద్యార్థుల సంబంధంలో అత్యంత కీలకమైన అంశం, ప్రస్తుతానికి వివాదంలో ఉన్న అంశం బోధనా మాధ్యమం.

**విద్యా విధానంలో బోధనా మాధ్యమ ప్రాముఖ్యత**

నూతన జాతీయ విద్యా విధానం మళ్ళీ అమ్మ భాష బోధనా మధ్యమమే శాస్త్రీయమని, సహేతుకమని, శ్రేష్టమని కుండబద్దలు కొట్టింది. ఇటీవల రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం కూడా మునుపెన్నడూ లేని విధంగా అత్యంత

సమగ్రమైన తీర్పును ఇస్తూ మాతృభాషనే భోదనా మధ్యమంగా కొనసాగించాలని తేటతెల్లం చేసింది. విద్యా హక్కు చట్టంలోని సెక్షన్ 29 లో బోధనా మాధ్యమం గురించి విశేషంగా పొందుపరిచారంటే, భోదనా మధ్యమం కూడా కరిక్యులంలో అత్యంత కీలకమైన అంశమనే కదా. కానీ "as far as  practicable" అన్న పదాల్ని వాడటం భిన్న అభిప్రాయాలకు తావిచ్చింది. ఆంగ్ల మాధ్యమ అనుయాయులు దీనిని వాడుకుంటూ, మాతృభాష మాధ్యమమే ఉండాలన్న అవసరం లేదంటూ పెడర్థాలు లాగారు. ఇప్పుడు కూడా నూతన జాతీయ విద్యా విధానంలోని సెక్షన్ 4.11 లో మాతృభాషా మాధ్యమంలోనే కనీసం 5వ తరగతి దాకా బోధన జరగాలని, 8వ తరగతి వరకు కూడా బోధనా మాధ్యమం మాతృభాషగానే ఉంచటం మేలని చెప్తే, "wherever possible"" తో ఆ వాక్యం మొదలుపెట్టారని, సన్నాయి నొక్కులు నొక్కుతున్నారు. "ఏ భాషను మేము ప్రజలపై రుద్దము" అని సెక్షన్ 4.13 లో త్రిభాష సూత్రంపై చెప్పిన విషయాన్ని, బోధనా మాధ్యమానికి ఆపాదించి, మోకాలికి బోడిగుండుకు లంకె వేస్తున్నారు. మాతృ భాష బోధనా మాధ్యమం గురించి ఏం రాశారో చెప్పకుండా కేవలం తమకు నచ్చిన ఇలాంటి పదాలనే సందర్భం లేకుండా చదివి ప్రజలను పక్కదోవ పట్టిస్తున్నారు.

**నిపుణుల నివేదికలే తిమిరాంతకాలు**

నిజానికి విద్యా హక్కు చట్టంలోని "as far as  practicable"" అన్న పదానికి సర్వోన్నత న్యాయస్థానం ఎలాంటి భాష్యం చెబుతుందో మన రాష్ట్ర ప్రభుత్వ కేసు విషయంలో వేచి చూడాలి. కానీ ఆ పదాలు వాడటానికి మూలం కొత్త జాతీయ విద్యా విధానంలో, ఆ మునుపటి డ్రాఫ్ట్ విద్యా విధానంలో స్పష్టంగా తెలిపారు. విద్యా విధానంలోని సెక్షన్ 4.11 మొదటి వాక్యం నుంచి చదివితే, మన రాష్ట్రంలో స్థానిక భాషగా ఉన్న తెలుగు మాతృభాషగా లేని వారికి కూడా, వారి మాతృభాషలోనే పాఠశాల వసతులను ఏర్పాటు చేయటం అవసరమని చెప్పారు. అంటే ఎవరి ఇంటి భాషలో వారు చదువుకోవటమే అత్యుత్తమం అని నిపుణులైన విధాన కర్తల అభిప్రాయం. భారతదేశంలోని భాషా వైవిధ్యం దృష్ట్యా, పాలన వ్యయ ప్రయసల దృష్ట్యా కుదరని పక్షంలో వారిని స్థానిక భాషా మధ్యమంలో చదివించాలి. అందుకోసం అలాంటి విద్యార్థులు ఉన్న పాఠశాలలో ద్విభాషా (విద్యార్థుల అమ్మ భాష, స్థానిక భాష) బోధనను పెంపొందించాలని అన్నారు. ద్విభాషా అంటే మనకు ఇక్కడ కోయ-తెలుగు, సవర-తెలుగు, తమిళం-తెలుగు, ఒరియా-తెలుగు, కన్నడం-తెలుగు ఇలా ద్విభాషల్లో మాట్లాడగలిగి, బోధించగలిగే వనరులను పెంపోదించాలి అన్నది విద్యా విధాన సారాంశం. అంతే కానీ ఆంగ్ల-తెలుగు లను ద్విభాషలుగా వాడాలని కాదు.

ఇలాంటి విషయాల్లో భేదాభిప్రాయాలు, అపోహలు తలెత్తినపుడు విధాన కర్తల ఆలోచనలను పరికించాలి. ఏ ప్రభుత్వ విధానమైనా, ఆయా రంగాల్లో దేశానికి లక్ష్యాలను నిర్దేశించి, నడవలసిన బాటను చూపించి, కావలసిన వనరులను తెలియచెప్తుంది. ప్రభుత్వాలు ఈ విధానాలను ప్రభుత్వ అధికార గణంతో కాకుండా ఆయా రంగాల్లో అపార అనుభవం  కలిగిన నిపుణులతో, సమాజంలోని మేధావులతోనూ విధానాల రూపకల్పన చేయిస్తుంది. ఇలాంటి విధానాలు న్యాయ పరిభాషలో స్వయంగా ఒక చట్టమో, ప్రభుత్వ ఆదేశమో కాకపోయినా, ప్రభుత్వం నియమించిన విశేషజ్ఞుల నివేదికగా, ప్రభుత్వం ఆమోదించిన నివేదికగా రమారమి ఒక చట్టానికి ఉన్నంత ప్రాధాన్యం సంతరించుకుంటుంది.  విధానంలోని అంశాలను అమలుపరచాల్సిన బాధ్యత కూడా ఖచ్చితంగా ప్రభుత్వం పైనే ఉంటుంది. దానికోసం అవసరమయ్యే ఆదేశాలను, విధులను ఇంకా చట్ట

సభలలో రాజ్యాంగ సవరణలను, చట్టాలను కూడా ప్రభుత్వాలు సాధించుకుని విధాన సూచనలు అమలుపరచాలి. పూర్వ జాతీయ విద్యావిధాన ఉద్దేశాల సాకారం కోసం, ఉచిత-నిర్బంధ ప్రాథమిక విద్యను, పౌరుల ప్రాథమిక హక్కుగా రాజ్యాంగ సవరణ చేశారు, విద్యా హక్కు చట్టం తెచ్చారు కదా.

## కార్యాచరణలో చిత్తశుద్ధి

రాజ్యాంగంలోని ఉమ్మడి జాబితాలో ఉన్న కారణాన విద్యా విధాన అమలు విషయంలో రాష్ట్ర ప్రభుత్వాలు కూడా తమ వంతు బాధ్యతను నిర్వర్తించాలి. నిజానికి స్థానిక ప్రభుత్వాలు పూనుకుంటేనే ఏ విధాన లక్ష్యాలనైనా సాధించగలిగేది. కేంద్ర సలహా సంఘంలో సభ్యులుగా రాష్ట్ర విద్యా శాఖ అమాత్యులు, కార్యదర్శులు సలహా సంఘం సమావేశాల్లో పాల్గొంటారు. తమ సూచనలను సందేహాలను వెలిబుచ్చుతూ సమాఖ్య స్ఫూర్తితో జాతీయ విద్యా విధానాన్ని ఆమోదిస్తారు. ఇప్పుడు కూడా గత సెప్టెంబర్లో జరిగిన సలహా సంఘం సమావేశంలో మన రాష్ట్ర మంత్రివర్యులు తమ అభిప్రాయాల్ని, సూచనలను తెలియజేశారు. ఒక్కసారి జాతీయ విద్యా విధానం సర్వ సమ్మతంగా తయారయ్యాకా, ఆమోదించిన విధానాన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తు చ తప్పకుండ పాటించాలి. కొత్త జాతీయ విద్యా విధానానికి అనుగుణంగా మన రాష్ట్రంలో ఇప్పటికే జరుగుతున్నా సంస్కరణలను ఖచ్చితంగా స్వాగతించాలి. కానీ ఇందాక చెప్పుకున్నట్లు, ఏ సంస్కరణాలైనా, తరగతి గదిలో గుణాత్మక మార్పును తీసుకువస్తేనే అది స్వాగతించాల్సిన విషయం. అందుకే ఇల్లు అలకగానే పండుగ కాదనట్లు, నూతన విద్యా విధానాన్ని కేంద్ర మంత్రిమండలి ఆమోదించినంత మాత్రాన మనకు మార్పులు ఏం కనపడవు. ఈ విధానాన్ని అర్థంచేసుకుంటూ, విధానం రూపొందించిన విశేషజ్ఞుల అభిప్రాయాల్ని గౌరవిస్తూ వాటిని అమలులోకి తేవడంలో ప్రభుత్వాలు చిత్తశుద్ధి కనబరిస్తేనే వాటి లక్ష్యాలు నెరవేరతాయి.



డా. నందివెలుగు ముక్తేశ్వరరావు

విశ్రాంత ఐఏఎస్

Email: nandivelugu@yahoo.co.in

Ph: +919491428078

Add:

Flat no 301, HariniTowers

